# NITI KATHA SANGRAHAM

*In Telugu Verse*

BY

**K. GOPAUL RAU**

# CHANDRAREKHA VILAPAM

BY

KUCHIMANCHI JAGGAKAVI

## 'The Crown of Humorous Poems'

"A Unique Parody and Satire in the Telugu Language"

**REVISED & EDITED BY K. GOPAUL RAU**

## OPINIONS

MR. G. KANAKARAJU PANTULU, B. A., B. L., Telugu Translator to Government:—

". . . Seeing that it is the best and the only satire and a parody in a classical form, in the language, the thanks of the literary public are heavily due to Mr. K. Gopaul Rau Pantulu for bringing out the book in its present form. . . . . . The skill and good taste shown throughout prove him to be a poet of no mean order."

THE HONORABLE MR. N. SUBBA ROW PANTULU, B. A., B. L., High Court Vakil:—

". . . . It is indeed a very difficult task to revise and adapt it as far as possible to the present day taste and requirements, while preserving its literary style and excellence. Mr. Gopaul Rau has done this with remarkable success. He possesses indeed a high order of literary ability and the thanks of the public are due to him for the pains he has taken in rescuing this work from oblivion and bringing it out in a readable form. The book will be welcomed as a unique parody and satire in the Telugu language.

THE HONORABLE RAJAH K. R. V. KRISHNA ROW BAHADUR, B. A., Zamindar of Polavaram:—

". . . . Mr. K. Gopaul Rau has taken very great pains in making the book as little vicious as possible and he therefore deserves great credit."

MR. M. RAMAKRISHNA KAVI, M. A., Editor of the "Forgotten Poets" Series:—

". . . . The book as it now stands contains all that is good in [illegible]iginal with some more wit and humour. . . . . . Mr. G[illegible] Rau has laid the Telugu public under obligation by producing the book in an acceptable form."

**Price One Rupee, Postage Extra**

**COPIES CAN BE HAD OF THE EDITOR**

**4, Acharappan Lane, George Town, Madras**



*K. Gopaul Rau*

Born: January 3, 1880 Photo in 1898

శ్రీరస్తు

# నీతికథాసంగ్రహము



ఇది

ఆంధ్రపద్యాత్మకంబుగ

## కొల్లకూరి గోపాలరావుచే

రచియింపఁబడి

మొదటి మూడు తరగతులకును పఠనీయగ్రంథముగ

దొరతనమువారిచే నంగీకరింపఁబడినది

పంచమకూర్పు 5,000 ప్రతులు
మొత్తము 20,000 ప్రతులు



"నీతిలేనివాని నిందింత్రు లోకులు
లేదు సేఁగి లాఁతి లేకయున్నఁ;
గాన మానవుండు పూనిక నయవిద్య
గడనసేయ మొదల గడఁగవలయు"

---

PUBLISHED BY THE AUTHOR
4, Acharappan Lane, Georgetown, Madras
1915

15

# KAVITVOPAYANAM

BY

K. GOPAUL RAU

## A Tribute in Verse to Their Majesties
## King George V and Queen Mary
## The Emperor and Empress of India

**Wrtiten in Honour of Their Visit to Madras**
**IN 1905-6**

## As the Prince and Princess of Wales

## ROYAL ACKNOWLEDGEMENT

"*The Private Secretary to the Prince of Wales is directed to thank Mr. K. Gopaul Rau for the copies of booklets containing Telugu verses, which he has been good enough to forward forHis Royal Highness' acceptance.*"

**PRESS OPINIONS**

THE HINDU—The poem is animated with deep sentiments of loyalty and devotion to the Throne and the Royal Visitors and contains many an admirable sentiment and idea poetically expressed. We congratulate the author on his production.

THE MADRAS STANDARD—The composition is all through characterized by a very genuine spirit of loyalty and its inspiration appears very distinctly in the fulness of expression of the Telugu portion and the enthusiasm with which the picture is there drawn. The composition in Telugu speaks extremely well of Mr. Gopaul Rau as a poet of great imagination and we wish him all success.

THE TELUGU PRESS HAS UNANIMOUSLY COMMENDED IT.

The first edition for free distribution is out of print.
A second one is in the Press. Price, As. 2

**COPIES CAN BE HAD OF THE AUTHOR**

**4, Acharappan Lane, George Town, Madras**

# PREFACE

On reading the Æsop's Fables, an idea flashed on my mind that there is a way of impressing effectively ethical and moral principles upon youthful minds by means of fables in their mother tongue in connection with the objects with which they are daily growing familiar. I am not forgetful of the fact that the Telugu Literature is replete with verses on the subject; but either the language in which they are clothed is too difficult for the youth to understand or the subject too sublime to comprehend. I therefore set myself to the task of translating a few of the fables in easy verse suited to the understanding of children; and some of my friends who saw the translation encouraged me in the undertaking. The book when published was well received by the public; and the rapid sale of the first two editions through which it has passed, shows that it supplies a real want. The Text-Book Committee have approved of its introduction for the Lower Secondary Classes into all the Recognised Schools in the Presidency; and it has already been prescribed as a Text-Book in most of the leading institutions here and elsewhere.

In issuing the third edition to meet the increasing demand for the book, I introduced illustrations for the better understanding of the fables. I take this opportunity of thanking my numerous friends and patrons who interested themselves in the book.

MADRAS
*1st January, 1904*

K. GOPAUL RAU

## PREFACE TO THE FOURTH EDITION

AT the kind suggestion of Mrs. E. A. Rhenius, Inspectress of Girls' Schools, Northern Circle, I have substituted *National Illustrations* in the present Edition, for the first two of the previous one. I take this opportunity of tendering my heartfelt thanks to Mrs. Rhenius for her invaluable help rendered to me. I hope this book with its improvements will be more useful in giving a touch of reality to the fables.

MADRAS
*1st January, 1905*

K. Gopaul Rau

---

## TO THE SEVENTH EDITION

WHAT with youthful curiosity to know how the work would be appreciated and what with the fear that the details might mar any chance of appreciation, I hid till today the fact that the work is my maiden attempt written in my early teens. That the book has been able to see the seventh print in a comparatively short period will by itself speak of its utility. My grateful thanks are due to the Director of Public Instruction, Madras, who has recently approved the use of the book in the Schools under Public Management, and to the Members of the defferent Taluk Boards and Municipalities — the latter including the Corporation of Madras—who extended their patronage to the book.

Earnestly hoping that the work will continue to have the same encouragement as heretofore,

I Remain, Dear Patrons and Readers,

Yours Gratefully

The Author

4, Acharappan Lane
George Town
MADRAS. March 22, 1915



శ్రీరస్తు

# విషయసూచిక

# CONTENTS

శ్రీరస్తు

# ప్రార్థనాదికములు



ఎవ్వానిమహత్త్వమును దెల్పు సృష్టి? యెవఁడ
వాఙ్మనసగోచరుండు? సర్వజ్ఞుఁ డెవఁడు?
ఎవఁ డనాదిమధ్యాంతుఁడై యెసఁగుఁ? నతఁడు
భూతనాథుండు జగములఁ బ్రోచువాఁడు.

క. మున్న ల్రగీర్కృన రచనం
చెన్నితికథాళి బుధులచిత్తము లలరన్
సన్నుతుఁ డీసపువారు; యం
ద న్నిచయం గొన్ని నేఁ దెనుఁగొనరింతున్.

తే. పాండితి యొకింత లేకయె బాల్యముననె
వ్రాయ నుద్యమించితిఁ; గానఁ బండితులగు
ప్రౌఢులకు నాదుకవిత తప్పక రుచించు
వచ్చియును రాని పిల్లలపలుకు లట్లు.

శ్రీరస్తు

# నీతికథాసంగ్రహము

## I. భూతదయ



క. పలుభంగమ్ములకును దా
వలమై వలనొప్పు నెక్కపద్మాకరముం
దిలకించి తద్వినిర్మల
జల మానఁగ నొక్కచీమ చనె నతితృషచేఁ.

ఆ. అరిగి విమలసలిల మాస్వాదనమొనర్చి
కాలవశమువలన గాడ్పు వీవఁ
దరఁగనడుమఁ జిక్కి తత్తటాకమ్మునఁ
గొట్టుకొనుచునుండె బిట్టువగను.

తే. కూలధాత్రీరుహంబునఁ గూరుచున్న
పల్లటీ యొక్కఁ డది గని ప్రబలకృపను
దాని రక్షింప సమకట్టి ధరణిఁ బడిన
శాఖ నొకదాని వైచెను సరసియందు. 3

తే. స్వీయజీవావనార్థము విడువఁబడిన
కొమ్మ నారోహణముచేసి కొంతదిటవుఁ
బూని యెట్టులో వీచికానిహతిని
దటమునకుఁ జేరెఁ జీమ. పిమ్మటను వనికి, 4

తే. పులుఁగు వేఁటాడ నెమ్మది నెలమి మిగుల
మృగయుఁ డొక్కరుఁ డరుదెంచి మేదినీజ
శాఖ నున్న కపోతరాజంబు నేయఁ
గార్ముకంబున నొకసాయకంబు దొడిగి, 5

క. గుఱిచూచుచుండ దానిని
గుఱు తెఱిఁగి పిపీలికంబు గుఱుకొని మార్మో
ల్నెఱపక వ్యాధునిఁ గుట్టెను;
గుఱిచెడి యతఁడఱచెఁ దేలు గుట్టెనొ యనుచున్. 6

క. అన్నినదము విని భీతిలి
ము న్నున్నపలాశి వదలి మునుమున వేఱొం
డున్నతపాదపమున సౌ
ఖ్యోన్నతి నివసించెఁ గలరవోత్తమ మెలమిన్. 7

తే. జలపోరామిఁ గన్గొని గౌర్వలేక
సాధ్య మైనంతయుపకృతి సలుపువానిఁ
గొండవంటివిపత్తు వైకొనిన నదియుఁ
బెండువలెఁ దూలిపోవును విస్మయముగ. 8

## II. "లోకోభిన్నరుచిః"



తే. గ్రాసమున కేమి లేమి ఖరమ్ము నమ్మ
కొనఁ దలఁచి వృద్ధుఁ డొక్కఁడు కొడుకుఁ గూడి
పొంత జరగెడుసంతకుఁ బోవుచుండె;
లేబరము గాదె ద్రవ్యము లేనిబ్రతుకు? 9

క. చనుచుండ మార్గమధ్యం
బున వా, రచ్చోట నీరమును జేఁదెడి యా
వనవతులు గొంద ఱది క
న్గొని తమలోఁదాము చెప్పికొని రీరీతిన్. 10

ఆ. "అమ్మలక్కలార, యాశ్చర్య! మాశ్చర్య!!
మిట్టి తెల్విమాలినట్టివార
లుందురోటు భూమియందు! మీ రెపుడైనఁ
గన్నవారె? కాక విన్నవారె? 11

క. చూడరె యల్లదె క్రొవ్విన
గాడిద తమతోడ నుండఁగా నెక్కక కా
ళ్లీడుచుకొని యెండం గడు
మాఁడుచుఁ జనుచున్నవారు మానినులారా!" 12

క. అనుచున్ ముక్కున వ్రేలిడు
కొని యద్భుతపడుచు మిగులఁ గొమిరెలు తమయౌ
వనమదమునఁ బరియాచక
మును గావించుటయు, వృద్ధపురుషుం డంతన్, 13

తే. అధికలజ్జాభరావనతాస్యుఁ డగుచు
రాసభమ్ముపై నధిష్ఠింపఁజేసి తనదు
కూర్మికుఱ్ఱను, వెన్నంటి యోర్మిమీఱ
నడవఁగఁదొడంగె నడుగులు తడఁబడంగ. 14

క. పిదప నొకవృద్ధజనచయ
మెదురుగ విచ్చేసి యెటకొ యేఁగుచు, నట న
మ్మునసలిపాట్లు విలోకిం
చి దరిం గనరానికిఁకఁ జెంది యెడందన్, 15

తే. "కన్నవాఁ డని యణుమాత్ర మెన్నఁబోక
యకట! తా గార్దభముమీఁద నధివసించి
తండ్రి నడపించుచుండె నీతండు కనరె
కాఁడు తనుజుండు దనుజుండు గాని వీఁడు. 16

తే. కంటిరే చిత్ర మీకలికాలమహిమ!
యిట్టిదుర్నయములను మున్నెపుడుఁ గనము;

చెట్టు చెఱుకాలమునఁ గాదె పుట్టుఁ గుక్క
మూతిపిందియ?" లని డెందమునఁ దలంచి, 17

తే. "ఓమరాత్మక ! ఘస్మర ! యోగిజాల్మ !
కంఠకావరమున నీవు కన్నుగనవు;
తల్లిదండ్రుల దైవంబు లెల్లరకును,
వారికన్నను మాన్యు లెవ్వారు గలరు? 18

ఆ. అక్కటకట ! వేఁగ ముక్కాలిముసలి నె
క్కింపఁ దగవుగాదె యింకనైన?
గ్రుక్కియున్నవాఁడు; చూడవో? కఠినాత్ముఁ
డవో? వివేకరహితుఁడవో? కుమార!" 19

క. అని సందలించి వెతలుట
యును, వృద్ధు తనూజు డించి యొయ్యన నారో
హణమాచరించెఁ; బిమ్మటఁ
గని యొకమాణవ్య మిట్లు కనలి వచించెన్. 20

తే. "కన్ను దెఱవని పసికూనఁ గండ్లు ముండ్లు
నాక ప్రేముడి నుంత్రైన లేక కాళ్లు
బురబురనుబొక్క నడపింపఁబూని తివుడు;
ముదిమిచే మది చెదరంగఁబోలు నీకు. 21

క. కడుపునఁ గన్నకుమారుని
వడివడి నడపించి ఖరముపై నెక్కఁగ నీ
యొడ నీయెడ యెటు దాఁకెను ?
జడమతి ! యింతైన వలదె సాకత? మకటా !" 22

క. అంచున్ దూఱంగ నొదల
వాంచి నిజాత్మజుని రాసభముమీఁదికి నె
క్కించుకొనె; నంత నొకనర
సంచయ మభిముఖముగాఁగఁ జనుదెంచి యనున్. 23

ఆ. "శుష్కగార్దభమును నిష్కారణంబుగా
బాధపెట్టి ప్రాణవాయువులను
దీయ భావ్యమగునె? దిగుఁడు వైళమ." యని
హాస్యమునకు మగుడ ననియె నిట్లు. 24

తే. "తగఁ బరోపకారార్థ మిదం శరీర'
మన్నలోకోక్తి, యీచిక్కియున్నగాడ్ద
నెక్కి బాధించుకన్న మీరే ఖరంబు
నెత్తుకొనిపోవు టెంతయు నుత్తమంబు." 25

తే. నావుడు న్వార లవరోహణంబొనర్చి
ఖరపదచతుష్టయంబును గలయఁ గట్టి
పొనర నొకకొయ్య తన్మధ్యమునను దూర్చి
మోయఁదొణఁగిరి నల్వు రాహా యనంగ. 26

క. అంతట బాటం జెన్నగు
వంతెనపై నేఁగుచుండ వా, రాశ్చర్య
స్వాంతులయి కొంద ఱఱచుచు
వింతగఁ జప్పటలుగొట్ట, వెంటనె ఖరమున్, 27

ఆ. ఆ కడిందినాదు నాలకించి బెదరి
కాళ్ల నిగుడఁదన్ని కట్లు ద్రెంచు

కొని బిరానఁ గ్రిందఁ దనరెడికాల్వలోఁ
బడి నశించె వృద్ధు వగలఁ బొగుల. 28

ఆ. అంత నంతఁ గని యనంతచింతాక్రాంతుఁ
డై సుతద్వితీయుఁడై స్వబుద్ధి
హీనతకును మిగుల నేడ్చుచు వచ్చిన
దారిఁబట్టి పోయెఁ దరలి ముసలి. 29

ఆ. అందఱ కనుకూల మగుప్రవర్తన మసా
ధ్యంబు; దానికొఱకు గాసఁ జనదు.
ఎల్లవారిఁ దనుపు నెవఁడు? 'లోకో భిన్న
రుచి' యనంగ వినమె యచలయందు? 30

## III. పరోపకారము



తే. గ్రీష్మమందుఁ బిపాసతో గీము వెడలి
సలిలము, లభింప మిగుల దవ్వులను, గ్రోలి
యొకకుజచ్ఛాయ శ్రమవాయ నొదిఁగి పండె
ఘోరవనసీమ నొక్కకంఠీరవంబు. 31

క. చెంగట శయనించిన యా
సింగముఁ గన కొక్కయెలుక చెఱలాడు చటన్
జెంగునఁ బైఁబడి నిద్రా
భంగము గావింప, హరియుఁ బటుకోపమునన్, 32

తే. పండ్లు పటపటఁ గొఱుకుచు బహుళవహ్ని
కణము లురుల విలోకించి కరుణమాలి
దాని సమయింప సమకట్టఁ, దలఁకుఁ జెంది
యిట్టు లనె మూషికము దైన్య ముట్టిపడఁగ. 33

క. "నేరిచియో నేరకయో
నేరము మీయెడల నిపుడు నేఁ జేసితి, మి
మ్మే రక్షణ వేఁడితి, నిఁక
నేరీతిం జూచెదరో మృగేశ్వర! కరుణన్? 34

తే. కసవు మెసవెడు నొకకీటకంబుమీఁద
సప్తవారాసు లింకింపఁ జాలినట్టి
సూర్యుఁడే తన వేఁడిమిఁ జూపునెడల
నింక దానికి రక్షకు లెవరు గలరు? 35

తే. వారణవితానకుంభవిదారణప్ర
భూతభూరియశోహేతుభూతమైన
భద్రనఖరాళి మాదృశక్షుద్రజంతు
రక్తమలినీకృతముఁజేయ యుక్తమగునె? 36

క. తలిదండ్రులు కడువృద్ధులు,
చెలి యిలు సవరింప లేదు, శిశువులు కొమరుల్,

వెలిబొబ్బమొకము! వారిం
దలఁచియయినఁ బ్రాణములను దయసేయఁగదే." 37

క. అని పలుతెఱఁగులఁ బ్రార్థిం
చినఁ, జిఱునగ వొదవ నపుడు సింగం బెలుకం
గని కరముం గనికరమునఁ
జను మని సెలవిచ్చి తననిశాంతముఁ జొచ్చెన్. 38

ఆ. అంతఁ గొన్నినాళ్ల కయ్యరణ్యమునఁ గ
వ్యాధుఁ డొక్కరుండు పన్ని యురుల
నరుగ, నందుఁ జిక్కె హర్యక్ష మక్కట!
విధి నతిక్రమింప విధికిఁ దరమె? 39

ఆ. వలను దగిలి యట్లు వగలను బొగులుచు
దానిఁ ద్రెంపఁ గడఁగి తనకు వశము
గామి దుఃఖమునను గర్జ సల్పె నహార్య
బిలతతిప్రతిధ్వనులు చెలంగ. 40

తే. అట్లు గర్జన మొనరింప నాలకించి
పూర్వపరిచయమునఁ జేసి పోల్చి యెలుక
"ప్రాణదానంబు చేసినబలియుఁ డేల
గుట్టుచెడి యిట్టు బిట్టుగఁ గుందనయ్యె?" 41

క. అని యాలోచించుచుఁ జని
చని వాగురఁ జిక్కి పొక్కు స్వప్రాణదునిన్
గని కదిసి యూఱడించుచుఁ
దనదుకృతజ్ఞతను దెలుపుతలఁపే, మూషకమున్, 42

తే. "మిత్రరత్నమ ! తడవేల? మృగయుఁ డదిగో
చూడు ! చూడుము !! లయకాలకాలుఁడనఁగ
బడియె నొకదానిఁ గైకొని వడి మదీయ
జీవమును దీయ వచ్చెడిఁ బ్రోవఁగదవె." 43

క. అని కేసరి ప్రార్థించుట
యును, నిజఖరదంతపంక్తి నుందురు వురులన్
దునియలొనరించె; నప్పుడు
చనె సింహాఖువు లమేయసంతోషమునన్. 44

తే. అధిపులకు నల్పులదియుఁ సాహాయ్య మొకటఁ
గలుగుట విరుద్ధకార్యము కాదు; గాన
నధిపుల మటంచు గర్వింప కందఱకును
సమత నుపకృతిసేయుట చాల లెస్స. 45

## IV. ముఖస్తుతి



క. అంగద నొకవాయసకుల
పుంగవ మెంతయును బాధపొందుచు నెటనో

డొంగిలి యొకపలశకల
మ్ముం గూర్చుండెను సమీపభూరుహశాఖ౯. 46

ఆ. కూరుచుండి దానిఁ గుడువఁ బ్రయత్నింపఁ
గ్రోష్టు వొకఁడు చూచి కుటిలవృత్తి
నాకుణమ్మునంద యది గిలుబాడఁ జి
త్తమ్మునం దలంచి తరువు దఱిసి. 47

తే. చిన్ని పూఁదేనె పూఁత పూసినకటారి
చందమున గోముఖవ్యాఘ్రసరణి వెలికి
నమృత మొలుకంగ లోన విషము చెలంగఁ
గరటకులశేఖరంబు నీగతి నుతించె. 48

క. "ఎన్నాళ్ల కబ్బెఁ గనుఁగొనఁ
గన్నార మదీయహితుని గమనీయగుణ౯
ము న్నేను నోఁచి దాఁచిన
పున్నియపుంగనిని నాదు పురుషార్థంబు౯. 49

తే. మిత్రమా ! నీకుఁ దావకమిత్రులకును
విందులకు నెల్ల సౌఖ్యంబె ? విందు గలిగె
నేఁడు నయనేంద్రియములకు; నీదుదర్శ
నమున ధన్యత నొందెను నాభవంబు. 50

క. నెలువను బేర్కొన నేటికిఁ
జిలువలదొరయును భవద్రుచిరతాగరిమ౯
బలుక నసమర్థుఁ డనఁగను?
గలకాలము బ్రతుకునట్టి కాకులజెట్టీ! 51

క. హారిసిల చక్రయుగ ని
ర్జరనాథకృపాణ ధార్తరాష్ట్రంబులతో
సరియై నెగడు భవత్తను
వరనయన త్రోటి గమన వైభవ మరయన్. 52

తే. సఖుఁడ! భవదీయసౌందర్యసౌకుమార్య
సాష్ఠవంబులు గాంచి నాస్వాంత మిపుడు
కొలఁది మించినహర్షాబ్ధి గ్రుంకి తనివి
యనెడితలమును గానకున్నది యొకింత. 53

క. అక్కాజ మగునీవిభవము
చక్కఁదనంబుననె కాదు; సంగీతములో
నక్కమలజుసుతుఁడైనను
నిక్కము నిను గెలువ నేర్చునే యెన్నటికిన్ ? 54

తే. ప్రాణమిత్ర! నీ వెలుఁగెత్తినంతమాత్రఁ
జివుకు గ్రమాఁకులు సైతముఁ జివురువట్టుఁ;
గార్యభంగము కాదేని గరుణఁజేసి
సలుపు మొకసారి కర్ణరసాయనంబు." 55

తే. అని ముఖస్తుతి యొనరింప నవ్వెడంగు
నక్కటక్కుల నెఱుఁగక మిక్కుటముగ
సంతసంపడి నిజగానసరణి వినిచి
దాన నలఘుతరఖ్యాతిఁ దనరఁ దలఁచి. 56

ఆ. 'కావుకావు' మనుచుఁ గ్రవ్యఖండము జాఱి
పడియెఁ బుడమి; దానిఁ బడసి యడరి
ఘోరిమాయు వపుడు చేరి నివ్వెఱఁబాటు
చెంది యున్న దీర్ఘజీవి ననియె. 57

క. "ఓయొంటరివిహగమ !
నీయెడ నున్న పనులు నెఱవేఱెను, నేఁ
బోయెద శ్రమపడవల దిఁకఁ,
నీయన్నె దాఁచుకొమ్ము నీ గానమ్మున్." 58

క. అజ్ఞజంబుకంబు చనుటయుఁ,
దనదురదృష్టమును మదిని దలపోయుచుఁ జిం
తను జెంది గతపరాభవ
మునుగూర్చి యేఁగెఁ గాకము న్నెలవునకున్. 59

తే. కార్యనిర్వహణార్థము కలుషమతులు
కొంద ఱిచ్చకముల నాడుచుందు రవని,
వారి నమ్మినఁ జేట్పాటు వారి మూఁకఁ;
స్తోత్రపాఠకు లరయ శత్రువులు గారె ? 60

---

## V. స్వతంత్రజీవనము



వృక మొకఁడు విపినమందు ఏ
రకమిం దగు మేఁత యొక్క రాత్రిఁ బయనమై

నికటపురిఁ జేరి యచ్చోట
నొకపెంపుడువేపి దిరుగుచుండం గనియె.

క. కని, చని సామీప్యమునకుఁ,
బ్రణమిల్లి, యెఱుంగఁజేసి బంధుత్వంబున్
దనదానిఁ, గుశల మారసి,
యనె నీచందానఁ గుక్కురాన్వయమణికిన్.

క. "హితమణి ! నీ వారోగ్య
స్థితి నున్నటు లెంతు, నొడలిచేవను మాపో
న్నతి నిన్నుఁబోనివారలు
వెతకిన మనలోన లేరు వ్రేలిడి చూపన్.

క. నాకంటె మంచిదశయం
దో కాలేయకమ ! యెట్టు లుండఁగలిగితో
యాకతము న్వచియింపవె
సాకల్యంబుగను, విందు సంతోషముగన్.

ఆ. నన్ను నేన తెల్పుకొన్నచో నాత్మస్తు
తిగను దోఁచుఁ గాని తెగువఁజేసి
పాడుపొట్ట నేదఁ బడరానిపాట్లను
బొందుచుందు సందుగొందులందు.

తే. అహరహంబును నీకన్న నధికముగను
బడిమడుంగులు నేఁగస్తిపడుటె కాని
కడుపు నిండక లేశ మాఁకటను డస్సి
చావునకు సిద్ధమైతిని సంగడీఁడ !"

ఆ. అనుడు సారమేయ మను "నస్మదుద్యోగ
మునకు నీవు నియ్యకొనియెదేని
నిదుఃజీవనంబు నెఱపెద నమితసౌ
ఖ్యముగఁ జింత యింతయైన లేక." 67

క. అనవుడుఁ గోకం బను "నీ
వానరుచు నుద్యోగ మెట్టిదో నాకనుకం
పను వచియింపవె; యాతెఱఁ
గున నేనుఁ జరింతు." ననుడుఁ గుర్కుర మనియెన్. 68

క. మఱియేమి లేదు సఖ! త
స్కరులను జొరనీక యరయఁజాలెదవలె యే
మఱుపాటు లేక రాత్రుల
దొరయింటిని గీ డొకింత దొడరకయుండన్?" 69

క. నా విని "పని యింతియకద
దేవా! మత్ప్రస్తుతస్థితి నిరంతరదుః
ఖావహమై కనుపట్టెడిఁ,
గావున నేదైనఁ గౌతుకమున నొనర్తున్." 70

క. జడికిని గఱువలి కోర్చి
కడునిడుమలఁ బడుటకంటెఁ గడుపునకై, యిం
పడర గృహంబున వేళకుఁ
గుడిచిన నోగిరము, సుఖము గూడునుగాదే?" 71

క. ఈహామృగ మిటు లన "సం
దేహమె దానికి? హితోపదేశము విని నా

తో హాయిగ రమ్మిఁక నీ
గేహముపైఁ దగుల మూఁడ్చి; క్లేశము వాయున్." 72

క. అని శునకము వాకొన నం
దున కౌనని యిచ్చగించెఁ దోఁడే, లవి రెం
డును గూడి పెరఁటిలోఁ దిరు
గునదన వృక మిట్లు కుక్కఁ గూర్చి వచించున్. 73

క. "అయ్యా! మీకంధరమున
నెయ్యదియో తేజరిల్లు హేలాగతిఁ; దా
నయ్యెడ నుండుటకుం గత
మెయ్యది? తన్నామధేయ మెయ్యది?" యనుడున్. 74

క. కట్టలుక నేరినైనను
బట్టి కఱతు ననెడిభీతిఁ బవలంతయు న
న్గట్టి నిశయందుఁ గావలి
పెట్టుదురు గృహాంగణమున విప్పి వయస్యా! 75

తే. హాయిగా నేను నిద్రించునట్టిదివస
కాలమున నన్ను గొలుసుచేఁ గట్టుకొఱకుఁ
గట్టి రీపట్టెడను నాదుకంఠమందుఁ;
గంటివే మిత్ర! దీనిచక్కఁదనంబు? 76

క. తేపులు నను బంధించిన
మాపులు విడిచెదరు; గాన మన్మానసవాం
ఛాపరతంత్రుఁడ నై యీ
యాపట్లన కెల్లకడల కరుగుదు వేడ్కన్. 77

క. మామకసుఖ మాలింపుము
తా మాంసము దినుచు నందుఁ దనరెడునెమ్మిన్
ప్రేమమెయి నోటి కిచ్చు స
ఖా ! మద్యజమానుఁ డాత్మహస్తాబ్జమునన్. 78

క. మనుగుడుపుఁ బెండ్లికొమరుని
యనువున నగ్గనుచు నింటియందలివార
ల్గనికరము పెంపుమైఁ బస
దన మిత్తురు తాము తినుపదార్థములెల్లన్. 79

క. విన్నాఁడవు నాసౌఖ్యముఁ
గన్నాఁడవు నాశరీరగరిమంబును న
న్నెన్నాడ సమ్మతంపడి
యున్నాఁడవె? శంకమాలి యోచెలికాఁడా!" 80

క. అనుచు మృగదంశకము ప
ల్కిన నయ్యది యెల్ల నాలకించి యనిష్టం
బును దెలుపువదనమున వా
కొని యిట్లు నికాయమునకుఁ గోకము చనియెన్. 81

క. "మోసము గాకయె చెప్పితి,
నీసౌఖ్యము నునిచికొమ్ము నీయొద్దనె, నే
నాసవడ స్వేచ్ఛ యొదవని
చో సామ్రాజ్యమునకైన శునకవరేణ్యా ! 82

ఆ. కాన నీదువెంట రా నిచ్చ లేదు ర
వ్వంతయును, క్షమింపు మయ్య శ్రమకుఁ;

బోయి స్వేచ్ఛ నుండు నాయగారమునందు
నెల వొసంగదేనిఁ జెలిమికాఁడ!" 83

తే. అన్యులకు విక్రయించి నిజాంగకంబు
నయ్య మీపుణ్య మనుచుఁ బాయసము దినుట
కంటె నిరవగ్రహముగఁ దాఁ గలకొలంది
గంజినీర్ద్రావుచుంటయె కడు సుఖంబు. 84

## VI. మాయోపాయము



క. పటుతరశాఖాయతము
త్కటపల్లవపర్ణశోభితము ఫలయుత మా
కుటము నొకదానిఁ గని కు
క్కుట మొక్కటి దానిమీఁదఁ గూర్చుండెఁ దమిన్. 85

ఆ. కూరుచుండి యట్లు "కొక్కొరోకో" యని
కూయ, దాని వీనుదోయిఁ బెట్టి

యమరె గ్రాస మనుచు నందంద చెఱలాడు
ఫేరవం బొకండు చేర వచ్చి, 86

క. చరణాయుధమును గన్గొని
ధరణిజమం దున్నకతనఁ దఃతలపోఁతల్
కొఱగామి వగచి మోసపు
టురులం బడఁద్రోయ నెంచి యొగి ని ట్లనియెన్. 87

తే. "మిత్రమానసశతపత్రమిత్ర! నిన్ను,
నిన్ను నాప్రాణములకన్న మిన్నయైన
వాని, వీక్షించుకల్మి సంప్రాప్తమగుట
నేఁడుగా పర్వదివసంబు నేత్రములకు! 88




ఆ. అందరాని తావునందలినీయున్కిఁ
గఱవు తీఱ నిన్నుఁ గౌఁగిలించు
కొని యమందసుఖము ననుభవింపఁగ నాకుఁ
బ్రాప్తి లేకపోయె ననుఁగుసకుఁడ! 89

క. కనుక మహీరుహమును డిగి
చనుదెంచి మదీయవాంఛ సాఫల్యముగా
నొనరింపవె హితరత్నమ!"
యనవుడుఁ గృకవాకురాజ మనె నీభంగిన్. 90

క. "దరిసించుటచే మిమ్ముల
నిరుపమకౌతుకమహాబ్ధినిర్మగ్నుఁడ నై
చరితార్థుఁడ నైతి; నిఁకన్
ధరణీస్థలి నన్నుఁబోనిధన్యులు గలరే? 91

క. దొరలేని కూర్మి నాయెడ
వఱలుట నే నెఱుఁగనే భవద్భావమునన్?
గరుణార్ణవు లవుటను దే
వర యాదరమార సాఁకవచ్చును నన్నున్. 92

క. మడియించి యితరమృగములు
కడుపార భుజించు నన్నుఁ; గావున నోసం
గడికాఁడా! రానోపను,
గడుపున లేనట్టిప్రేమ కౌఁగిటఁ గలదే? 93

తే. కాన నారామి నెన్నక కరుణఁజూడ
వేఁడుకొనియెద." నా విని యీడులేని
కల్లప్రేముడి బయటికి వెల్లివిరియఁ
బలికె నల్లన నిమ్మాడ్కి వంచకంబు. 94

ఆ. "సఖుఁడ! లేనిపోనిసందేహముల మాన
సంబునందుఁ బెంచి సాజమైన
స్నేహబంధములను జెండాడ నెంచితే?
చింత లేదె చిన్నమంత యైన? 95

క. ర మ్మింకఁ గ్రిందికి నీదుభ
యమ్ము న్విడనాడి, మృగచయమ్మునకు విహం
గమ్ములకు సంధి కుదిరెను
జ, మ్మది తెల్పెదను ద్రుమచూడవరేణ్యా! 96

ఆ. చెలిమికాఁడ! వినుము క్షీరోదకన్యాయ
మునను గలసి మెలసి కసరులేని

వైకమత్య మూని యందఱు సోదర
భావమున మెలంగి ప్రబలుటకును, 97

తే. అలంతు లెవ రేని హృత్పుటమ్ములను రగులు
పూర్వవైరమ్ములను దలపోసికొనుచు
వక్రమతి నీవిధాన మతిక్రమింప
దండ మొందుటకును, నిబంధనము జరిగె. 98

తే. చూడఁ జోద్యమయ్యెడిఁ దామ్రచూడవర్య!
యెఱుఁగవే నీవు చాటింప నిన్నిమార్లు
సంధివృత్తాంత?" మనుచు నాశ్చర్య మభిన
యింపఁ దొడఁగెను గనుచు నిలింపవీథి. 99

క. కనుఁగొని యాటక్కులు లె
క్కనుగొన కెటులైన జంబుకంబును దనచెం
తను బాసి పోవునట్టులు
పొనరింపఁ దలంచి కోడిపుంజు బిరానన్. 100

ఆ. వింతమొగపుగుంపు వెఱ యొడందను నింపు
చున్నయట్లు దవ్వునుండి, చూడఁ
జాగె నొక్కప్రక్క; జంబుక మటఁ గల
రూపు దెలియ దానిరూపుఁ జూచి, 101

ఆ. "ఏమిచిత్రములను వీక్షించె దిప్పు డా
దిశ? విశేష మున్న విశదముగను
దెల్పు." మనుడు మెట్టవాల్పిట్ట యిట్లనుఁ
"జిత్ర మేమి లేదు చెలిమికాఁడ! 102

క. మనకెలనికి వేఁపులగుమి
యనిలత్వర వచ్చుచున్నయది యేమిటికో!"
యనుడు సృగాలము భీతి
న్గొని, తటతట గొట్టుకొనఁగ గుండెలు, వల్కెన్. 103

క. "సెల విడి పంపవె, యిచట
న్నిలువఁగరా దొక్కయర్థనిమిషంబైనన్
జెలికాఁడ! పోదు." ననుచు బ
యలుదేఱఁగ, నగతిఁ జరణాయుధ మనియెన్. 104

ఆ. "తాళు! తాళు! మింతతత్తఱపా టేల?
సర్వజంతుతతికి సంధి కలిగె
నంటి విపుడకాదె? హా! యింతలోననె
జాగిలంబు లనిన జంకె డేల? 105

క. ఆశునకానీకంబు ప్ర
వేశించెడిదనుక నిలుము వెఱపేది, సృగా
లేశ! త్వదన్యోన్యసమా
వేశము నీక్షించి నీయభీష్టము దీర్తున్." 106

క. అని కోడి వేఁడికొన "నిలు
వను, వినియెనొ లేదొ సంధివార్తాతతి నిం
కెను శ్వానము, లెవ రెఱుఁగుదు?"
రని పిక్కబలంబు చూపె నవ్వలఁ బడిన్. 107

తే. మోసములు చేసి కొంపలు ముంపఁ బేరు
మోసిన మహాత్ము లనుకంపఁజేసి పోలె
నారయుచుందురు కుశలంబు; వారియెడల
ఋజుపథంబున నెపుడు వర్తింపఁ జనదు. 108

---

## VII. విద్యాప్రయోజనము



తే. కాంచి యొకవంచకము, నాచరించి వంద
నంబు నత్యర్థభక్తి మనంబునందుఁ
దేజరిల, నొక్కమార్జాలరాజ మమిత
వినయపూర్వకముగ నిట్లు విన్నవించు. 109

తే. ఆర్య! తావకదర్శనప్రాప్తివలనఁ
గాంచినాఁడను గన్నులు గలఫలంబు,
పండె మత్పురార్జితపుణ్యఫలము నేఁడు
పృథ్వి ననుఁబోని సుకృతి యొందేనిఁ గలఁడె ? 110

ఆ. అఖిలవిద్యలందు నద్వితీయులరు మీ,
రలఘుశేముషీబృహస్పతులరు;
భవదనుగ్రహమునఁ బండితులైరి పె
క్కండ్రు; మిము నుతింపఁగలఁ డెవండు? 111

క. మీ చరణసేవ సేయుట
కై చనుదెంచితి, శ్రమంబు ననుకంపమెయిన్
సైఁచి ననుం దమశిష్యుని
ధీచణు నొనరింపవే సుధీనుతచరితా! 112

క. పామరుఁడ నైన భవదీ
యామేయదయాసమృద్ధి నౌ నన మీరల్
నేమమునం జదివెద న
య్యా! మద్గురుభక్తి కెల్ల రచ్చెరువడఁగన్." 113

క. నావుడు సృగాల మిట్లను
"నీవినిచిననాదుప్రజ్ఞ నిక్కము, తనిసెన్
భావము నీయోగ్యతఁ గని,
కావలసినయుక్తు లెల్లఁ గఱపెద నీకున్. 114

తే. అఖిలతంత్రములందు నాయంతవానిఁ
జేసెదఁ గుమార! నీ కింత చింత యేల?
యింతవఱ కేమి నేర్చితో, యింక నేమి
కఱచెదో, మేము ముందుగ నెఱుఁగవలయు." 115

క. అనవుడు బిడాల మిట్లను
"ననఘా! నే నెంతవాఁడ? నారయ నానే

ర్చిన దెంత? దైన, భవదా
జ్ఞను దాఁటం జనునె? సాహసం బొనరింతుఁ. 116

ఆ. వేఁటవేఁపిగములు వెన్నాడునప్పుడు
సరకుగొనక వాని, క్షణములోన
వృక్ష మెక్కి ప్రాణరక్షణంబును జేసి
కొనఁగలాఁడ నేను గురువరేణ్య!" 117

క. అని "యింతియ నా తెలిసిన"
దన "నిన్నుం జూడ జాలి యగుచున్నది, నీ
వనయంబును నావెనువెం
టనె యుండు, మభీప్సితం బొడంగూడు వడిఁ. 118

క. కను మొగిచి తెఱచునంతనె
కనుఁగొన నగు వేనవేలుగను దంత్రములఁ;
గనుకఁ బ్రియశిష్య! వానిని
గనుగలిగి గ్రహింపు" మని సృగాలము నొడివెఁ. 119

క. గురుశిష్యు లీక్రియఁ బర
స్పరసంభాషల నొనర్చు సమయమ్మునఁ గు
ర్కురములతో నచ్చోటికొక
దారి మృగయావిహృతి నెఱప దొరఁకొని వచ్చెఁ. 120

తే. వానితోడి వేఁపులఁ గాంచి పరిసరావ
నీరుహారోహణంబున నేర్పు మెఱయఁ
దనదునసువులఁ గాపాడుకొనె బిడాల;
మారయ న్నేరిచినవిద్య వ్యర్థ మగునె? 121

తే. అన్ని బిరుదము ల్వచియించె నంతెకాని
సమయవిస్ఫూర్తి లేక చిత్తము కలంగి
శునకములవాతఁ బడి కెడసెను సృగాల;
మింతెకా డాంబికులగతి యెంచి చూడ! 122

తే. అక్కఱకురాని విద్యాసహస్ర మేల?
కలితఫలదాయివిద్య యొక్కటియె చాలుఁ;
బరిమళవిహీనకింశుకప్రసవకోటి
కంటె వలచుగులాబి యొక్కటియ మేలు. 123

---

## VIII. స్వార్జితము



క. ఈక్షితి నెవ్వరిజీవన
మక్షీణసుఖాస్పదంబొ యనువిషయమునన్
మక్షికకుం జీమకు ము
న్నక్షురతర్కం బొకానొకప్పుడు గలిగెన్. 124

తే. అంత నాకీటములకు సిద్ధాంతపూర్వ
పక్షపూర్వకవాదంబు పరఁగుతఱిని
ముందునకు వచ్చి తా జయమొందఁ గోరి
యిట్టు లనెఁ జర్వణ కడిందిపట్టుదలను. 125

ఆ. "నాదు వైభవంబు నగభేదిని హసించు,
నాదుజీవనంబు మోదదంబు;
నాదుజీవనంబునకు సాటి నాజీవ
నంబు దక్కఁ దదితరంబు లేదు. 126

తే. దినదినము దేవునికి నివేదనమొనర్ప
భక్తిమైఁ జేసి యుంచునపారమధుర
రససమంచితాఖిలపదార్థముల వ్రాలి
సామికంటెను ముందు నిచ్చలు భుజింతు. 127

క. ఒరు లరుగరాని యంతః
పురముల కే నేఁగి లోలపూఁబోఁడులసుం
దరపేశలకటతటముల
నిరతము ముద్దాడుచుందు నెక్కొనువేడ్కన్. 128

తే. అనిశము ననర్ఘసర్వంసహాతలేశ
శీర్షభూషణమకుటాగ్రసీమలందు
సైతమును జిత్తవృత్తిని సంచరింతు
ననఁగఁ, దన్మందిరవిహార మనఁగ నెంత? 129

తే. అమితపావనదేవాలయముల కేఁగి
మానితస్వర్ణవిగ్రహమస్తకాగ్ర

మానవార్పితమాలావితానలలిత
సూననిష్యందమకరంద మానుచుందు. 130

క. పలుపలుకు లేల? విను మే
నలసట సుంతైన లేక యసమానసుఖం
బుల నొందుదుఁ; దత్సమములు
కలనైనం గలవె నీకుఁ గాఱియవడిన్?" 131

క. అని తనయాధిక్యంబును
వినిపింపఁగ నాలకించి విసపుంజిఱున
వ్వొనయఁ దననెమ్మొగమ్మున
నన నీవిధమునఁ బిపీలికాగ్రణి కడఁకన్. 132

ఆ. "చాలుఁ! జాలు! నింకఁ జాలింపవచ్చు నీ
చదువులెల్ల; సిగ్గుఁ జంపి వెడఁగ!
యిట్లు వదర నౌనె? యిది యెవ్వరైనను
విన్న నగుదు రనెడి వెఱపు వలదె? 133

క. నిను బొట్టు పెట్టి పిలిచిన
విని గొప్పగ నెంచవచ్చు విందుల నీచె
ప్పినవానిఁ; గాని యీపిలు
వనిపేరంటంబు నవ్వఁబా టగుఁ గాదే? 134

తే. అఖిలసౌఖ్యాళి నే ననాయాసముగను
బొందుచుండెద నని నీవు పొంగుచుందు;
గడన సేయక యనుకూలకాల మెల్ల
వ్యర్థముగఁ బుచ్చి జడిఁ గష్టపడెద వీవు. 135

తే. యుక్తసమయంబునందు నే నొడలు వంచి
కూడఁబెట్టినకొలుచును గుడుచుచుందు
గవని దాఁటక జడిని లాఁగను యథేచ్ఛ
నిట్టుపాసంబు సల్పక నిన్నుఁబోలె. 136

తే. ఎఱనుగొని నిన్న నింటి కే నేఁగుచుండ
దారినడుమను నీబంధువార మెల్లఁ
గుల్లి నీళులు కాఱెడి కుక్కయొఱచి
మొఱ్ఱచుండెను గడుపార మేఁత లేక. 137

ఆ. అందలమున నెక్కి యాదివారంబున
సోమవారమునను జోలెవేయు
నీదుసౌఖ్య మరయ నిజ మనన్యప్రాప్య;
మట్టిసుఖము పగర కైన వలదు. 138

ఆ. కాన నింక బుద్ధి గలిగి యసామాన్య
మైనసుఖము తేరగా నజస్ర
మనుభవింతు నని స్మయంబు నొందక ముందు
బ్రతుకు తెరువు చూచి బ్రదుకు." మనియె. 139

తే. పుడమి న్యాయము దప్పక యొడలు వంచి
పాటుపడి విత్త మార్జించువార లొకరె
పరమసౌఖ్యంబులను దాము పడయఁగలరు;
అన్యభాగ్యోపజీవుల కది హుళిక్కి. 140

తేటగీతి

శ్రీభరద్వాజగోత్రవర్ధిష్ణు
కాళ్లకూరివంశపయోర్ణవకువలయాప్త
రాజయామాత్య
గోపాలరాయరచితమైన
నీతికథాసంగ్రహంబు
ముగిసె



శ్రీరస్తు

# నీతికథాసంగ్రహము

## లఘుటీక

---

### I. భూతదయ

1. పలుభంగమ్ములు = పెద్ద అలలు. తావలము = ఊనికిపట్టు. వలనొప్పు = అందమగు. పద్మాకరము = కొలను. తిలకించు = చూచు. ఆను = త్రాగు. అతితృష = అధికదాహము, దప్పి.

నానార్థములు.—భంగము = అల, అంతరాయము. పద్మము = తామర; పద్మ = లక్ష్మి.

2. ఆస్వాదనమొనర్చు—ఆస్వాదించు = త్రాగు. కాలవశము = విధి, ప్రారబ్ధము. తరఁగ = అల. బిట్టు = మిక్కిలి. వగ = విచారము, చింత.

3. కూలధాత్రీరుహము = (ఆకొలని) గట్టుమీఁది చెట్టు. పల్లటీ = పావురము. సమకట్టు = యత్నించు.

4. స్వీయజీవావనార్థము = తన ప్రాణములను కాపాడుకొఱకు. ఆరోహణముచేయు = ఎక్కు. దిటవు = ధైర్యము. వీచికానిహతి = అలలచే కొట్టఁబడుట, అలలదెబ్బ.

5. మృగయుఁడు = వేఁటకాఁడు. పులుఁగు = పక్షి. మేదినీజశాఖ = చెట్టుకొమ్మ. కపోతరాజంబు = శ్రేష్ఠమైన పావురము. కార్ముకంబు = విల్లు. సాయకంబు = బాణము.

6. పిపీలికంబు = చీమ. గఱుకొను = యత్నించు. వ్యాధుఁడు = వేఁటకాఁడు.

7. నినదము=ధ్వని. పలాశి=చెట్టు. మునుము=ఎదురు. పాదపము=వేరుచేనీరుపీల్చునది— చెట్టు. కలరవోత్తమము=శ్రేష్ఠమైన పావురము.

8. పోరామి=ఆపద. వైకొను=కలుగు. విస్మయము=వింత. కొండ వంటి.........పోవును = కలిగిన యాపద కొండంత బరువుగా నుండునది యయ్యును బెండంత తేలికగా తొలఁగు నని భావము.

---

## II. 'లోకోభిన్నరుచిః'

9. గ్రాసము=తిండి. ఖరము=గాడిద. ప్రాంత=సమీపము. లేబరము=శూన్యము—నిష్ప్రయోజనము.

11. ఉందురోటు = ఉందుర కాఁబోలు.

13. కొమిరె = యౌవతి, పడుచు. పరియాచకము = పరిహాసము, ఎగతాళి.

14. అధిక.........తాస్యుఁడు=ఎక్కువసిగ్గుచేత వంపఁబడిన తల గలవాఁడు. రాసభము=గాడిద. అధిష్ఠింపఁజేయు=ఎక్కించు.

15. వృద్ధజనచయము=ముసలివాండ్రగుంపు. దరింగనరాని=అపారమగు. కింక=కోపము— రూ. అం.— కిన్క, కినుక. ఎడంద=హృదయము.

16. అణుమాత్రము = మిక్కిలికొంచెము, రవ్వంత. గార్దభము=గాడిద. అధివసించు=ఎక్కికూర్చుండు. తనుజుండు = శరీరమువలన పుట్టినవాఁడు—కుమారుఁడు. దనుజుండు=దనుసంతతివాఁడు—రాక్షసుఁడు.

18. ఘస్మరుఁడు=తిండిపోతు. జాల్ముఁడు=నీచుఁడు. కావరము=క్రొవ్వు, మదము. మాన్యులు=గౌరవార్హులు, మర్యాదచేయఁదగినవారు.

19. ముక్కాలిముసలి = కఱ్ఱ చేతికివచ్చిన ముసలివాఁడు. తగవు=యుక్తము. గ్రుక్కు=మైమఱచు. వివేకరహితుఁడు=యుక్తాయుక్త జ్ఞానము లేనివాఁడు.

20. మందలించు=హెచ్చరించు. తనూజుఁడు=తనుజుఁడు. ఒయ్యన=మెల్లఁగా. మాణవ్యము=బాలురసమూహము. కనలు=కోపించు.

21. కంఠ్లు=రాళ్లు. నాక=అనక. సుంత=కొంచెము.

22. ఎడ=సమయము. ఎడ=హృదయము, ఎద. జడమతి=మందబుద్ధిగలవాఁడు. సాకతము=జాలి, దయ.

23. ఔదల=తల. వాంచు=వంచుకొను. నిజాత్మజుఁడు=తనకొడుకు. నరసంచయము=మనుష్యులగుంపు.

24. శుష్క గార్దభము = బక్క గాడిద. భావ్యము = యుక్తము. వైళము=శీఘ్రము.

25. 'పరోపకారార్థ మిదం శరీరం'=ఈ దేహము ఇతరులకు మేలు చేయుటకొఱకు (అయియున్నది).— పరోపకారము చేయుట శరీరము యొక్క ముఖ్యప్రయోజనము.

26. ఖరపదచతుష్టయంబు=గాడిదయొక్క నాలుగుకాళ్లు. పొసఁగు=ఒప్పు — రూ. అం.—ఒనరు.

28. కడింది నాదు=కఠోరమైన ధ్వని. నిగుడఁదన్ను=సాఁగఁదన్ను. బిరాన=శీఘ్రముగా. పొగులు=తపించు.

29. అనంతచింతాక్రాంతుఁడు = తుదలేని విచారమునకు లోఁబడిన వాఁడు. సుతద్వితీయుఁడు=కొడుకే రెండవవాఁడుగాఁగలవాఁడు—కొడుకును వెంటఁబెట్టుకొనినవాఁడు. స్వబుద్ధిహీనత=తన తెలివిమాలినతనము. తరలు=బయలుదేఱు.

30. చనవు=కూడదు. తనుపు=తృప్తిపఱచు. 'లోకోభిన్నరుచిః'=లోకులు తమతమ యభిప్రాయములయందు వేఱుగుచుందురు—'జిహ్వకొక రుచి పుఱ్ఱెకొకబుద్ధి' ఇది దీనికి సరియైన తెనుఁగుసామెత.

## III. పరోపకారము

31. పిపాస=దప్పి. గీము=గృహము, ఇల్లు దవ్వు=దూరము. కుజచ్ఛాయ=చెట్టునీడ. ఘోరవనసీమ=భయంకరమగు అరణ్యప్రదేశము. కంఠీరవంబు=సింహము.

32. చెంగున=అకస్మాత్తుగా, తటుక్కున. హరి=సింహము.

33. బహుళవహ్నికణములు = పెక్కుమిణుఁగురులు. ఉరులు = జాలు. సమయించు=చంపు. తలఁకు=భయము. మూషికము = ఎలుక. ఉట్టిపడు=అకస్మాత్తుగాఁ గలుగు.

34. మృగేశ్వరుఁడు=మృగరాజు—సింహము.

35. మెసవు=తిను. కసవు......కీటకంబు=పచ్చికమీఁద జీవించు పురుగులప్రాణము (సాధారణముగా) అత్యంతసూక్ష్మ మని గ్రహించునది. సప్తవారాసులు=ఏడుసముద్రములు.

36. వారణ......భూతము=ఏనుఁగుల సమూహముయొక్క కుంభస్థలములను చీల్చుటవలనఁ గలిగిన విశేషమైనకీర్తికి(చీల్చుటకు)కారణభూతము (ముఖ్యసాధనము). భద్రనఖరాళి=మంగళకరమైనగోళ్లవరుస, (వరుసగా నున్న నీగోళ్లు). మాదృశ......మలినీకృతము = నావంటి యల్పజీవియొక్క నెత్తుటిచేత మైలపఱుపఁబడినది.

37. సవరించు=చక్కఁబెట్టు. వెలిబొబ్బమెకము=సింహము.

38. ఒదవు=వ్యాపించు. కరము=మిక్కిలి. నిశాంతము=ఇల్లు.

39. క్రవ్యాదుఁడు=వేఁటకాఁడు. ఉరులు=వలత్రాళ్లు. హర్యక్షము=సింహము. విధి=తలవ్రాఁత. విధి=బ్రహ్మ.

40. గర్జ సల్పు=గర్జించు. అహార్యబిలతతి ప్రతిధ్వనులు = కొండగుహల సమూహముయొక్క మాఱుమ్రోఁతలు.

42. వాగుర = వల. స్వప్రాణదుఁడు = తనప్రాణములను ఇచ్చిన

వాఁడు—చంపక విడిచినవాఁడు. తతి=సమయము.

43. తడవు = అలస్యము. లయకాలకాలుఁడు=సృష్టిని సంహరించు నప్పటి యముఁడు—భయంకరవిగ్రహ మనుట. బడియ=కొయ్య.

44. కేసరి = సింహము. నిజఖరదంతపంక్తి = తనవాడిపల్వరుస. ఉందురువు=ఎలుక. సింహాఖువులు=సింహము, ఆఖువు (ఎలుక). అమేయ సంతోషము=అత్యధికమైన సంతోషము.

45. విరుద్ధము=విపరీతము. సమతన్=సమానముగా. ఉపకృతి=ఉపకారము—సహాయము. లెస్స=మంచి, యోగ్యము.

---

## IV. ముఖస్తుతి

46. అంగద=ఆఁకలి. వాయసకులపుంగవము=కాకిజాతిలో శ్రేష్ఠమైనది—శ్రేష్ఠమైనకాకి. పలలకలము = మాంసపుముక్క. సమీపభూరుహశాఖ=దగ్గఱనున్న చెట్టుయొక్క కొమ్మ.

47. కుడుచు=తిను. క్రోష్టువు=నక్క. కుటిలవృత్తి=కౌటిల్యము—చెడుతలంపు. గిలుబాడు=దొంగిలించు. తటియు=సమీపించు.

48. చిన్ని.........కటారి = (చిన్నిపూవు=ఒకమాదిరి పుష్పము. కటారి=వాడిమొన గల ఒక ఆయుధము.) స్వతస్సిద్ధముగా హానికరమైన దయ్యును పైనున్న తేనెపూఁతవలన దుర్గుణమును మఱుఁగుపఱచుకొనుటయే కాక లేనిగుణము నారోపించుకొని యితరులను వంచించుకటారి. గోముఖవ్యాఘ్రము=ఆవుమోము గల పెద్దపులి, (పైదానివలె గ్రహించునది). కరటకుల శేఖరంబు=శ్రేష్ఠమైనకాకి.

49. కమనీయగుణుఁడు=(చక్కని) మంచి స్వభావము గలవాఁడు నోఁచిదాఁచిన పున్నియపుంగని = వ్రతములుచేసి కూడఁబెట్టిన పుణ్యమునకు స్థానభూతము. పురుషార్థంబు=పురుషార్థస్వరూపము—ధర్మార్థకామమోక్ష

ములు అని పురుషార్థంబులు నాలుగు.

50. విందులు=బంధువులు. విందుగలుగు=వినోదముకలుగు. ధన్యత=సంతుష్టి. భవంబు=పుట్టుక, జన్మము.

51. నలువ=బ్రహ్మ, (చతుర్ముఖుఁడు). చిలువలదొర=శేషుఁడు, (వేయిపడగలతాల్పు). భవద్రుచిరతాగరిమ=నీచక్కదనముయొక్క యాధిక్యము. కలకాలముబ్రతుకు=దీర్ఘజీవియగు. జెట్టి=మల్లుఁడు, (శ్రేష్ఠవాచకము). వేయి ముఖములుగలవాఁడే వర్ణించుట కశక్తుఁడన్నప్పుడు నాలుగుముఖములుగలవాని కెట్లు సాధ్యమగు నని భావము.

52. (1) హరినీలము=ఇంద్రనీలము, నలుపు. (2) చక్రయుగము=జక్కవలజోడు, (వర్తులత్వము). (3) నిర్జరనాథ కృపాణము=వజ్రాయుధము, (పదును). (4) ధార్తరాష్ట్రము=హంస, (మెల్లన). (1) తనువు. (2) వరనయనములు. (3) త్రోటి=ముక్కు. (4) గమనము.—వైభవ మీనాల్గిటితో సమసించును. పైనాల్గిటికి క్రింది నాల్గు క్రమముగా నుపమానములు.

53. భవదీయ ...... సౌష్ఠవంబులు = నీయొక్క చక్కఁదనము కోమలత్వము పరిపూర్తి. స్వాంతము = మనస్సు. హర్షాబ్ధి=సంతోషమనెడి సముద్రము.—నిన్ను చూచుటయందు నామనస్సు అత్యంతసంతోషముచేత తృప్తిపొందక యున్న దని భావము.

54. అక్కజము=ఆశ్చర్యము. కమలజుసుతుఁడు నారదుఁడు—ఇతఁడు సంగీతమునందు ప్రసిద్ధుఁడు.

55. ఎలుఁగెత్తు=కంఠధ్వనిచేయు. సైతము=సహితము. కర్ణరసాయనంబు = చెవులపండుగు, (రసాయనము = తియ్యనిపానకము).

56. వెడంగు=బుద్ధిలేనిది (కాకి). నిజగానసరణి=తనపాటయొక్కపద్ధతి. వినుచు = వినిపించు. అలఘుతరఖ్యాతి= అంతకంటె గొప్పకీర్తి.

తనరు=ఒప్పు.

57. క్రవ్యఖండము = మాంసపుతునుక. అడరు = ప్రయత్నించు. భూరిమాయువు=నక్క. చీరు=పిలుచు. దీర్ఘజీవి=కాకి.

58. ఒంటికంటివిహగము=ఏకాక్షి, కాకి—(విహగము=పక్షి).

59. జంబుకము=నక్క. దురదృష్టము = దౌర్భాగ్యము. గతపరాభవము = పొందఁబడిన అవమానము. నెలవు=స్థలము.

60. కార్యనిర్వహణార్థము = పనిసాధించుకొనుకొఱకు. కలుషమతులు=పాపబుద్ధిగలవారు. ఇచ్చకములు=ముఖప్రీకొఱ కాడు మాటలు. చేడ్పాటు=బాధ. అవారి=అపరిమితము. మూఁడు=సంభవించు. స్తోత్రపాఠకులు=స్తుతిచేయువారు.

---

## V. స్వతంత్రజీవనము

61. వృకము=తోఁడేలు. విపినము=అడవి. నికటపురి = దగ్గఱనుండు పట్టణము. వేఁపి=కుక్క.

62. బంధుత్వేఁబుం దనదానిక్ = తనబంధుత్వమును. కుక్కురాన్వయమణి=కుక్కలజాతిలో శ్రేష్ఠమైనది.

63. ఆరోగ్యస్థితి=రోగములేకుండుట. చేవ=సత్తువ. రూపోన్నతి=విగ్రహపుష్టి. పోని=పోలిన.

64. కౌలేయకము=కుక్క. కతము = కారణము. సాకల్యము=సంపూర్ణము (సకలత్వము).

65. ఏదు=పోషించు. గొంది=ఇఱకటపుత్రోవ.

66. అహరహము=ప్రతిదినము. కస్తి=కష్టము. సంగడీఁడు=చెలికాఁడు.

67. సారమేయము=కుక్క. అస్మదుద్యోగము=మాయొక్కకొలువు. ఇయ్యకొను=ఒప్పుకొను.

68. కోకము = తోఁడేలు. అనుకంప = దయ. చరించు = నడచుకొను—ప్రవర్తించు. ఘుర్కారము=ఘుక్క.

69. తస్కరులు=దొంగలు. తొడరు=కలుగు.

70. మత్ప్రస్తుతస్థితి = నాయిప్పటియునికి. నిరంతరదుఃఖావహము = ఎడతెగని వ్యసనమును కలిగించునది. కౌతుకము=సంతోషము.

71. జడి=పెద్దవాన. కరువలి=గాలి. ఇడుమ = కష్టము. ఓగిరము= ఆహారము. కూడు=కలుగు.

72. ఈహామృగము=తోఁడేలు. హితోపదేశము = మేలయినబోధ. హాయి=సుఖము. గేహము=ఇల్లు. తగులము=ఆసక్తి. ఊడ్చు=వదలు, విడుచు. క్లేశము=కష్టము.

73. వాకొను=చెప్పు. అదను=(ఔపవిభక్తికము) సమయము.

74. కంధరము = మెడ. హేలాగతి = విలాసముగా. తన్నామధేయము=దాని పేరు.

75. కట్టలుక = మిక్కిలి కోపము. గృహాంగణము = ఇంటియొక్క ముంగిలి. వయస్యుఁడు=స్నేహితుఁడు.

76. దివసకాలము=పగటివేళ.

77. ఱేపులు=పగళ్లు. మాపులు = రాత్రులు. మన్మానస...పరతంత్రుఁడను = నామనస్సుయొక్క కోరికలకు లోఁబడినవాఁడను—నాయిష్టప్రకారము. పట్లు=స్థలములు.

78. మామకసుఖము=నాయొక్క సౌఖ్యము. ఎమ్ములు = ఎముకలు. మద్యజమానుఁడు=నా అధికారి. ఆత్మహస్తాబ్జము=తనకేలుదమ్మి, కమలము వంటి తనచేయి.

79. మనుగుడుపు పెండ్లికొమరుఁడు = అత్తగారియింటిలో విందులు గుడుచు క్రొత్తపెండ్లికొడుకు (మనుగుడుపు=అల్లెము). అనువు=విధము.

పసందనము=బహుమానము.

80. శరీరగరిమము = దేహముయొక్క స్థూలత్వము — పుష్టి. వెన్నాడు = వెంబడించు.

81. మృగదంశకము = కుక్క. అనిష్టము = సమ్మతిలేమి. వదనము = మొగము. నికాయము = ఇల్లు.

82. సామ్రాజ్యము = ప్రభుత్వము. వరేణ్యుఁడు = శ్రేష్ఠుఁడు.

83. అగారము = ఇల్లు.

84. అన్యులు = ఇతరులు. నిజాంగకంబు = తన దేహము. నిరవగ్రహము = స్వేచ్ఛ.

## VI. మాయోపాయము

85. పటుతర శాఖాయతము = మిక్కిలి దృఢమైన కొమ్మల చేత ఎత్తయినది. ఉత్కటపల్లవపర్ణశోభితము = అధికమైన చిగుళ్లచేతను ఆకుల చేతను ప్రకాశించునది. ఫలయుతము = పండ్లతో కూడినది. కుటము = చెట్టు. కుక్కుటము = కోడి. తమి = ప్రీతి.

86. వీనుదోయి = రెండుచెవులు. అమరు = సిద్ధముగానుండు. గ్రాసము = ఆహారము. చెలిలాడు = తిరుగు. ఫేరవము = నక్క.

87. చరణాయుధము = కోడి. ధరణిజము = చెట్టు. తలపోఁత = ఆలోచన. కొఱగామి = పనికిరాకపోవుట. మోసపుటురులు = మోసమనెడి ఉచ్చులు. ఒగిన్ = పూనికతో.

88. మిత్ర...మిత్రుఁడు = స్నేహితుల మనస్సులనెడి కమలములకు సూర్యుఁడు—స్నేహితులను సంతోషపెట్టువాఁడు. మిన్న = అధికము. ఈక్షించు = చూచు. పర్వదివసము = పండుగదినము.

89. అమందసుఖము = అధికమైనసౌఖ్యము.

90. మదీయవాంఛ=నాకోరిక. కృకవాకురాజము = శ్రేష్ఠమైనకోడి.

91. దరిసించు = చూచు. నిరుపమ కౌతుక మహోబ్ధి నిర్మగ్నుఁడు = సమానములేని సంతోషమనెడి గొప్పసముద్రమునందు మునిఁగినవాఁడు—మిక్కిలి సంతోషించినవాఁడు. చరితార్థుఁడు=ధన్యుఁడు. ధరణీస్థలి=భూప్రదేశము.

92. దొర=సమానము. భవద్భావము=నీమనస్సు. కరుణార్ణవులు = దయయను సముద్రము వంటివారు—అధికమైన దయగలవారు. ఆరు=అతిశయించు. సాఁకు=రక్షించు.

93 మడియించు=చంపు. సంగడికాఁడు=స్నేహితుఁడు.

94. కల్లప్రేముడి=లేనిప్రేమ. వెల్లివిరియు=ఉప్పొంగు. అల్లన = మెల్లఁగా. వంచకము=నక్క.

95. సాజము =సహజము. స్నేహబంధము = చెలిమియొక్క కట్టుఁబాటు. చెండాడు = ఖండించు—చెఱచు. చిన్నము=కొంచెము—నాల్గు గురిగింజలయెత్తుగల బంగారునాణెము.

96. మృగచయము = మృగములసమూహము. విహంగము = పక్షి. సంధి=సమాధానము, తామ్రచూడము=కోడి.

97. క్షీరోదకన్యాయము = పాలు నీళ్లు కలసినట్లు. కనరు=రుచ్యము కానిది (కనరులేని=మనఃపూర్వకముగు). అలఁతులు=కొలఁదివారు.

98. హృత్పుటము = మనఃప్రదేశము, (పుటము=దొప్ప, పుటము). పూర్వవైరము = మునుపటిపగ. వక్రమతి=కుటిలమైన మనస్సు. విధానము= నిబంధన. దండము=శిక్ష. నిబంధనము=కట్టుఁబాటు.

99. అభినయించు = అభిప్రాయమును సంజ్ఞలచేత తెలుపు. నిలింపవీథి=ఆకాశము.

101. వింతమెగపుగుంపు = ఇతరమృగముల సమూహము. వెఱ =

భయము. కలరూపము=ఉన్నవిధము.

102. మెట్టివాల్విట్ట=చరణాయుధము—కోడి.

103. కెలన=ప్రక్క. అనిలత్వర = గాలివేగమువంటివేగము. సృగాలము=నక్క.

105. సర్వజంతుతతి = అన్నిజంతువులసమూహము. జాగిలము = కుక్క. జంకు=భయపడు.

106. శునకానీకము = కుక్కలగుంపు. ఏదు=విడుచు. త్వదన్యోన్యసమావేశము = మీయొక్క యొకరితోనొకరు కలసియుండుట. అభీష్టము=కోరిక

107. సంధివార్తాతతి = సంధి వృత్తాంత సమూహము. శ్వానము= కుక్క. పిక్కబలంబుచూపు=పరుగెత్తు. వఱడు=నక్క.

108. కుశలము=క్షేమము. ఋజుపథము=సరియైనదారి.

---

## VII. విద్యాప్రయోజనము

109. అత్యర్థభక్తి = మిక్కిలి స్నేహము. మార్జాలము = శ్రేష్ఠమైనపిల్లి. వినయపూర్వకముగ=అణఁకువతో.

110. ఆర్యుఁడు = గొప్పవాఁడు. తావకదర్శనప్రాప్తి = నిన్ను చూడఁగలుగుట. మత్పూర్వార్జితపుణ్యఫలము = నాయొక్క పూర్వజన్మమునందు సంపాదింపఁబడిన పుణ్యమనెడు పండు. పృథ్వి = భూమి. సుకృతి= పుణ్యాత్ముఁడు.

111. అద్వితీయులు = అసమానులు. అలఘుశేముషీబృహస్పతులు= గొప్పబుద్ధియందు దేవగురువులు—(అంతటివారనుట). భవదనుగ్రహము= నీదయ.

112. సైఁచు=సహించు. ధీచణుఁడు = మిక్కిలి బుద్ధిమంతుఁడు.

సుధీనుతచరితుఁడు=పండితులచేత స్తోత్రము చేయఁబడిన నడవడిక గలవాఁడు.

113. పామరుఁడు = అజ్ఞానుఁడు. భవదీయ...సమృద్ధి = నీయొక్క విశేషమైనదయయొక్క సంపూర్ణత. నేమము = నియమము. అచ్చెరువడు=ఆశ్చర్యపడు.

114. ప్రజ్ఞ=బుద్ధి. తనియు = తృప్తిపడు. కఱపు= నేర్పించు.

115. అఖిలతంత్రములు=సమస్తమైన ఉపాయములు. కుమారుఁడు=బాలుఁడు, (వాత్సల్యపూర్వకమైన సంబోధన).

116. బిడాలము = పిల్లి. అనఘుఁడు = పాపములేనివాఁడు. భవదాజ్ఞ=మీయుత్తరువు.

117. గమి=సమూహము. సరకు=లక్ష్యము. కలాఁడు=కలవాఁడు.

118. అనయము=ఎల్లప్పుడు. అభీప్సితము = కోరిక. ఒనఁగూడు=లభించు.

119. మొగుచు = మూయు. వేనవేలు = వేయివేలు—అనేకము. కనుగలుగు=జాగ్రత్తపడు. నొడువు=చెప్పు.

120. క్రియ = విధము. పరస్పరసంభాషలు = ఒకరితోనొకరు మాట్లాడుకొనుట. మృగయావిహృతి = వేఁటవిహారము. దొరఁకొను = యత్నించు.

121. పరిసర...ఆరోహణంబు = ప్రక్కనున్న చెట్టెక్కుట. అసువులు=ప్రాణములు.

122. బీరములు = పౌరుషపుమాటలు. సమయ విస్ఫూర్తి = వేళకు జ్ఞాపకమువచ్చుట, తటితెలివి. వాతఁ=నోటియందు. కెడయు=చచ్చు.

123. విద్యాసహస్రము = వేయివిద్యలు. కలితఫలదాయి = మంచి ఫలము నిచ్చునది. పరిమళ...కోటి = వాసనలేని కోటిమోఁదుగు పూవులు. వలచు=పరిమళించు.

## VIII. స్వార్జితము

124. క్షితి = భూమి. అక్షీణసుఖాస్పదము=తఱుఁగని (స్థిరమైన) సౌఖ్యమునకు ఆశ్రయమైనది. మక్షిక=ఈఁగ. అక్షరతర్కము = తీఅని వాదము.

125. కీటములు = పురుగులు. సిద్ధాంత...వాదంబు = స్థాపించుట ఆక్షేపించుట మొదలుగాఁగలిగిన తగవు. చర్వణ=ఈఁగ.

126. నగభేది=ఇంద్రుఁడు. మోదదంబు=సంతోషమునిచ్చునది.

127. నివేదనము = ఆరగింపు. అపార...పదార్థములు=మితములేని తియ్యనిరసముచేత ఒప్పుచున్నట్టి సమస్తమైన వస్తువులు. నిచ్చలు = ఎల్లప్పుడు.

128. పూఁబోణులు = స్త్రీలు. సుందరపేశలకటతటములు=అందమయినట్టియు మృదువైనట్టియు చెక్కిళ్లయొక్క ప్రదేశములు. నిరతము=ఎల్లప్పుడు. సెక్కొను=అతిశయించు.

129. అనర్ఘ...సీమలు = రాజులతలలయందలి వెలలేని సొమ్ముల యొక్కయు కిరీటములయొక్కయు కొనలప్రదేశములు. చిత్తవృత్తి=ఇష్టప్రకారము. తన్మందిరవిహారము=వారియింటియందు తిరుగుట.

130. అమిత...ఆలయములు = మిక్కిలి పరిశుభ్రములైన దేవళములు. మానిత...మకరందము = పూజింపఁబడు బంగారుప్రతిమల తలలకొనలయందు మనుష్యులచేత ఉంచఁబడిన పూవుదండల సమూహమునందలి మనోహరమైన పుష్పములనుండి కారెడు తేనె.

131. తత్సమములు=వానికి(ఆసుఖములకు) సమానమైనవి. కాఠియ=కష్టము.

132. ఆధిక్యము=గొప్పతనము. విసపుంజలునవ్వు = విషముతోకూడిన (కుత్సితపు) మందహాసము. పిపీలికాగ్రణి=శ్రేష్ఠమైన చీమ.

134. విందు=ఆతిథ్యము—(నీచెప్పినవిందు లని అన్వయము).

135. అనాయాసము=ప్రయాసలేమి. గడనసేయు = సంపాదించు. పుచ్చు=జరుపు.

136. కొలుచు=ధాన్యము. గవని=ముఖద్వారము. లాఁగ=రంధ్రము. యథేచ్ఛ=ఇష్టప్రకారము. నిట్టుపాసము=శుష్కోపవాసము.

137. ఎఱ=ఆహారము. ఎఱచి=మాంసము.

138. అందలము...జోలెవేయు = (త్వరగానశించు) స్వల్పసుఖము పొందు—(ఒకనాఁడువిందు ఒకనాఁడుమందు) ఇది సరియైన మఱియొక లోకోక్తి. అనన్యప్రాప్యము=ఇతరులకు పొందరానిది. పగఱ=శత్రువులు.

139. తేరగా=కష్టపడకుండఁగా. అజస్రము=ఎల్లప్పుడు. స్మయంబు=గర్వము.

140. విత్తము=ధనము. అన్యభాగ్యోపజీవులు=ఇతరులభాగ్యమువలన జీవించువారు. హుళిక్కి=లేదు.

Andhra Patrika Press, Madras—1915

# అపూర్వ సంఘ సంస్కరణము

## కాళ్లకూరి గోపాలరావు

రచియించినది

శ్రీ మానవల్లి రామకృష్ణకవి, ఎమ్. ఏ. గారు

ఆంగ్లేయమున వ్రాసిన

మిక్కిలి ప్రశస్తమైన యుపోద్ఘాతము కూడఁ గలదు

కథ యద్భుతము, ధోరణి యపూర్వము

శ్రీ దివాన్ బహదూర్ కంచి కృష్ణస్వామిరావు, సి. ఐ. ఇ. గారీ గ్రంథమును గూర్చి యాంగ్లేయమున వ్రాసిన జాబుయొక్క యాంధ్రీకరణ మీ క్రింద పొందుపఱుపఁబడియె.

"హిందూదేశజనులయొక్క సంస్కరణసంరంభములంగూర్చి యపహసించు మీ 'అపూర్వసంఘసంస్కరణ' మనెడి యాంధ్రకావ్యమును నేను శ్రద్ధతోను సంతోషపూర్వకముగాను చదివితిని. పద్యములు సులభములై మనోజ్ఞముగా నున్నవి. ఆత్మార్థపరిత్యాగ మక్కఱలేని శుష్కోపదేశంబునకును, కేవలము స్వప్రయోజన పరత్వముచే చేయు జనతానియోగ నిర్వాహకాడంబరంబునకును మీరు స్పష్టముగా ప్రతికూలురై యున్నారు. తప్పక తొలఁగింపఁదగిన లోపంబులను జనులు శ్రద్ధాళువులై గ్రహించునట్లు సమర్థించుటయే మీ ముఖ్యోద్దేశము. మీ గ్రంథము వాస్తవమైన పురోభివృద్ధికి కొంతవఱకు నుపకరింపవచ్చునని నేను దృఢముగా విశ్వసించెదను. దేశాభిమాన పురస్సరమైన యీయుద్యమంబున మీకు జయము సిద్ధించును గాక!"

# కవిత్వోపాయనము

## కాళ్లకూరి గోపాలరావు

రచియించిన యీ కృతి

శ్రీ జార్జిచక్రవర్తియు శ్రీ మేరీచక్రవర్తినియు

వేల్సుయువరాజదంపతులుగా

1905-6-వ సంవత్సరమునందు చెన్నపట్టణమునకు విచ్చేసినపుడు

ప్రభుభక్తిపురస్సరముగా సమర్పింపఁబడి

కృతజ్ఞతాభివాదపూర్వకముగా స్వీకరింపఁబడియె

## అభిప్రాయములు

ఆర్యమతబోధిని.— ఒక చిన్న హస్తాభరణమగు పుస్తకము. ఈ పద్యములయందు రావుగారు శ్రీవారికి పూర్వులీ హిందూదేశమునకు నొనర్చిన కొన్ని మహోపకారము లగ్గడించుచు వారిని గొనియాడి తమకుఁ గల భక్తివిశ్వాసములు వెల్లడిచేసికొనిరి. పద్యములు హృద్యములుగా నున్నవి.

మనోరమ.— గ్రంథము సలక్షణమై మనోహరముగా నున్నది.

కృష్ణాపత్రిక.— కవిత్వము పటుత్వము కలిగి, ప్రౌఢముగను, రసవంతముగను ఉన్నది. ఈ చిన్న పొత్తము సమస్తవిషయములచేతను శ్లాఘాపాత్రమని మా యభిప్రాయము.

సువర్ణలేఖ.— పద్యములు ధారాళముగా నడుచుచున్నవి.

శశిలేఖ.— ఈ పద్యములు ముచ్చటగ నున్నవి..........ఇట్టి బుద్ధికౌశలము గలవారిని ప్రాజ్ఞులు ఆదరించుట తగు నని తోఁచుచున్నది

దీని నాంగ్లేయపత్రికలు సైతము కొనియాడినవి.

పంచిపెట్టుటకు వేయఁబడిన మొదటికూర్పు ప్రతులైపోయినవి

రెండవకూర్పు సిద్ధమగుచున్నది. వెల 2 అణాలు మాత్రమె

ప్రతులు కావలయువారు గ్రంథకర్తకు వ్రాయుఁడు

4, ఆచారప్పన్ సందు, జార్జిటవును, మదరాసు

# OPINIONS

THE LATE HONORABLE RAO BAHADUR P. ANANDA CHARLU, Vidyavinoda, Visarada, C. I. E:—

"I have read with much pleasure the little book 'Niti Katha Sangraham' by Mr. Gopaul Rau. It is a creditable performance for a first effort; and it gives unmistakable proof of latent literary powers, which better subjects are bound to call forth. I wish the young author all success."

MR. V. VENKATARAYA SASTRY, Retired Senior Sanskrit Pandit and Superintendent of Vernacular Studies, Christian College, Madras :—

"I have read portions of Mr. K. Gopaul Rau's 'Niti Katha Sangraham.' ...I have been favourably impressed by their felicitous and chaste composition."

Mr. V. Subba Rau Pantulu, Telugu Pandit Presidency College, Madras :—

"I was teaching Mr. K. Gopul Rau's 'Niti Katha Sangraham' in Hindu High School, Triplicane. It is written in a good style".

MR. M. KAMESWARA ROW PANTULU, B.A., Inspector of Schools, Second Circle :—

"I have been through your 'Niti Katha Sangraham' and am of opinion that it is quite suited to be used as a text-book in the Lower Secondary forms."

Mr. S. B. PALIT, B. A., Asst. Inspector of Schools Ganjam District :—

"It is a suitable text-book for the Lower Secondary forms."

Mr K. SUDARSANA ROW PANTULU, B. A., L. T., Sub Asst. Inspector of Schools, Vizianagram :—

"I have gone through your work. The book has 'solid merits' which make it a 'very suitable text-book' for the Third Form"

Mr. K. NARASIMHAM PANTULU, B. A., L. T., Head Master, R. Ch. High School, Pittapur :—

"It is a very interesting book written in clear, simple and elegant Telugu."

**Seventh Edition 5000, Total 20,000 Copies. Price, 4 As.**

COPIES CAN BE HAD OF THE AUTHOR

4, Acharappan Lane, George Town, Madras

